## పీఠిక.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి సంస్థానాధిపతులగు రాజశ్రీ మహారాజా వెంకట శ్వేతాచలపతి రావు బహద్దర్ కే సి ఐ-ఇ మహారాజావారు సంవత్సరమున మహాభారత యుద్ధకాలమును ంచ గలరాయని ప్రస్తావన చేసిరి.

అది మొదలా పురాతన కాలమును పరిశీలించు నసమర్థుడనైనను శ్రీవారిచిత్తవృత్తి ననుస వలసి యుండుటచే నందుకుపయోగించెడి గ్రంథ హమును జేయుచుంటిని.

ఇట్లుండ మా॥ గురజాడ అప్పారావు పంతు లు 1905వ సం॥రమున మహారాజశ్రీ పోలవరపు స్థానాధిపతులగు కొచ్చెర్లకోట రామచంద్ర వెంక కృష్ణారావు బహద్దర్ బి ఎ. గారిచే నాంధ్రీకరిం డిన రాజతరంగిణియను గ్రంధమును నాకిప్పించి దర్శనలాభమును కలుగజేసిరి.

అప్పుడిట్లో నా గ్రంధమున వారిచే వ్రాయబడి మహాభారత యుద్ధకాలమునుగురించి కొంతప్రసం గ జరిగినది

అది నాయుద్యమమునకు మరింత ప్రో
త్సాహమును కలుగజేసినది.

అందుపై నిక్షేపయమునుగూర్చి ఆంగ్లేయ
గ్రా మా॥ పండిత గోపాలాచార్యుల వారు, శ్రీ
నాథుగారు మొదలగువారిచే వ్రాయబడిన య
ంను తెలిసికొనియు, కల్హణపండిత నిర్మిత
రాజతరంగిణిలోనివియు, భారత భాగవత విష్ణు
పురాణాది గ్రంథములలోనియు సంశయములను పరిశో
ధించియు జ్యోతిస్సిద్ధాంతగ్రంథములననుసరించి గ్రహ
గణితములను జేసియు వానినన్నిటిని పరిశీలించి
వ్రాసితిని.

రాజ కథాశ్రియములను పదునొకండు గ్రంధములను, నీలమునిగ్రంధమును పరిశీలించి య్ద దలిష్ఠాలిత్యములను పూర్వరాజ దత్తములగు శా ములనుబట్టి సంస్కరించియు శ్రీ ఛవిలాకరపద్మమిహి రహేలరాజాది గ్రంధముల ననుసరించియు కల్హణ డితుడు క్రీస్తువెనుక 1150వసం॥రమున రాజతరంగి యనుపేరుతో కాశ్మీర రాజచరిత్రయను నొకగ్ర మును సంస్కృతమునవ్రాసెను.

ఆగ్రంధమున మహాభారతయుద్ధము క్రీస్తు పూర్వము 2443వ సం॥రమున జరిగినటులగానబ్బ చున్నది.

ఆగ్రంధమును శ్రీ పోలవరము సంస్థాన తులు, ఎల్లరకు సులభసాధ్యమగునటుల తెనుగున యబూని మొదట యొకభాగమును బ్రిచురించిరి

అందు కల్హణపండితుడు వ్రాసినకాలమున భారత యుద్ధము జరగలేదనియు క్రీస్తునకుపూ 1194వసం॥రమున జరిగినటులను వ్రాసిరి.

కల్హణపండితుడు శాలివాహనశకా కు కలియుగములో 3179 సంవత్సరములు గ

సిద్ధాంతగ్రంథములందు గనబడుటవలనను, ఆ
యుధిష్ఠిర శక కాలపరిమితి 2526 సం॥రములైన
బృహత్సంహిత13వ అధ్యాయములోని 3వ శ్లోక
మట్టి కనబడుచుండుటవలనను కలియుగములో
3179-2526 ) సం॥రములు గతించినతరువాత
ధర్మని రాజ్యారంభమైనట్లుల గనబడుచున్నది
గావున నా కాలమున మహాభారతయుద్ధము జరి
గెను.

క్రీస్తుశకారంభమునకు కలియుగములో 3101
సం॥లు గతించినవిగావున నాకాలమునకు పూర్వ
(3101-653)=2448వసం॥రమున మహాభారతయు
ద్ధము జరిగెనని కల్హణపండితుని యభిప్రాయము
పిఠాపురము పోలవరము సంస్థానాధిపతులు పాండవ యు
ద్ధము రాజతరంగిణిలో నుదహరించిన కానిష్క
పూర్వము1263సం॥రముల క్రిందట రాజ్యము జే
సె రాజతరంగిణినిబట్టి కనబడుచుండుటవలనను
ము క్రీస్తువెనుక 78వసం॥రమున రాజ్యమునకు
వచ్చెను ఆంగ్లేయచరిత్రకారులు స్థిరపరచుటవలన
యుధిష్ఠిరుడు క్రీస్తునకుపూర్వము1190( 1263-78)

సం॥రము లకిరిందట రాజ్యముజేసినటుల వ్రాసిరి.

ఇవియునుంగాక యుధిష్ఠిరుడు బుద్ధునకు పూ ర్వము 650సం॥రములకిరిందట రాజ్యముజేసినటుల నుదహరించిన బృహత్సంహిత శ్లోకమును బట్టి కనబడుచుండుట వలనను బుద్ధుడు కీరిస్తునకు పూ ము544వ సంవత్సరమున నిర్వాణమునొందినటుల గ్గేయచరిత్రకారులు స్థిరపరచి యుండుటవలనను స్తునకుపూర్వము 1194 ( 650 + 544 )వ సం॥ర యుధిష్ఠిరుని రాజ్యారంభమైనటుల గనబడుచున్న

కావున నాకాలమున కీరిస్తునకుపూర్వము 11 సం॥రమున మహాభారతయుద్ధము జరిగెననివ్రాసిరి

కీరివియునుంగాక మరికొన్ని కారణముల నపరచిరి.

ఇందవి విచారింపబడినవి.

అవి సులభముగ దెలియుటకై రాజతరం మొదలగు గ్రంథముల ననుసరించి యిందొకపా ను గనపరచితి.

ఇందానుబట్టి రాజతరంగిణికా రుదహరించిన
ల, క్రీస్తు వెనుక 78వసంగరముల రాజ్యము చేసి
గ్యాయమటకవకాశము గనబడదు.

వంనన

తృతీయ గోనందుని రాజ్యారంభ కాలము నకు
2330సంగరములకు కల్హణపండితుడు రాజ
రచించెను.
కల్హణపండితుని కాలమిప్పటికి క్రీస్తుశకము 1908వ
నకు 53సంగరములై యుండెను.
తృతీయగోనందుని రాజ్యారంభ కాలము నం
టికి(233 + 758)=3033సంగరము లగ్నాను
అభిమన్యుని పరిపాలనకాలము చే యుండు
క(య,అనుకొనియెదము. అంకెవలన రాజ
నుదహరించిన కానిష్కుని రాజ్యారంభ కా
లమిప్పటికి య + 3088సంగరములై యుం
క్రీస్తుశకమును బట్టిచూడ కానిష్కుని రా
జ్యము క్రీస్తుపూర్వము (య + 3088-
య + 1180సంగరములైనను
ని (య) యొక్క విలువ యేమాత్రమును

కొనినను. కానిష్క రాజ్యాంశకాలము క్రీస్తునకు పూర్వము 1180సం॥రముల క్రిందటనై యుండవలెను

కావున క్రీస్తువెనుక 78వసం॥రమున రాజ్యము చేసి నకానిష్కయును రాజతరంగిణిలో నుదహారింపబడి నకానిష్కయును నొకడేయనుట కవకాశమిాయదు

పైని వ్రాయబడిన ప్రకారము రాజతరంగిణిలో నుదహరించిన కానిష్క క్రీస్తునకు పూర్వము 1180 సం॥రములక్రిందట రాజ్యము జేసినటులగనబడెను

ఈకానిష్క బుద్ధనితరువాత 150వస॥రము లో రాజ్యము చేయుట వలన బుద్ధుడు క్రీస్తునకు పూర్వము ( 1180 + 150 )= 1330సం॥రముల క్రిందట నిర్వాణము నొందినటుల గనబడుచున్నది.

కాన బుద్ధునికి పూర్వము 650సం॥రముల క్రిందట పాండవుయుధిష్ఠిరుడు రాజ్యము జేసినను క్రీస్తునకు పూర్వము ( 1330 + 650 ) =1980సం॥రముల క్రిందట యుధిష్ఠిరుడు రాజ్యము జేసియుండవలెను

కావున యుధిష్ఠిరుడు క్రీస్తునకు పూర్వము 1949వ సం॥రమున రాజ్యమునకు వచ్చెననుట కవకాశము

గనబడదు.

కురుపాండవ యుద్ధములో పడియున సమున
బడిన భీష్ములవారుత్తరాయణము వచ్చునరకు ప్రాణ
ములను ధరించియుండెననియు నుత్తరాయణ ప్రవేశ
దినముననే భీష్మనిర్యాణమనియు నాదినము మాఘ
శుద్ధైకాదశి యనియు మహాభారతమున జెప్పఁబడి
యున్నది

అందువలన మహాభారతయుద్ధము జరిగినసం॥
రమున మాఘ శుద్ధైకాదశి నాడుత్తరాయణ ప్రవేశ
మైనటుల గనబడుచున్నది.

శ్రీ పోలవరము సంస్థానాధిపతులు వ్రాసిన
కాలమున మాఘశుద్ధైకాదశినా డుత్తరాయణప్రవే
శముగనబడదు.

కల్యాణపండితుడు వ్రాసినసం॥రమున మాఘ
శుద్ధైకాదశినాడుదయకాలముననుత్తరాయణ ప్రవేశ
మయినది.

కాననిది కల్యాణపండితుడు పొందినయభిప్రా

యనుచు బలపరచుచున్నది.

వీరిరువురువ్రాసిన కారణములను పరిశీలింపగ యిప్పటికి కల్యాణపండితుడు వ్రాసినదియే యుక్తము గనున్నటుల గానబడుచున్నది కాని యింతతో నాయుద్యమము నెరవేరెనితలంపను



శ్రీ రా[illegible]

# మహాభారత యుద్ధకాల విమర్శనము.

---

మహారాజశ్రీ పోలవరము సంస్థానాధిపతుల
గు కొచ్చెర్లకోట రామచంద్ర వెంకట కృష్ణారావు
బహదరు బి. ఎ. గారిచే నాంధ్రీకరింపబడిన రాజ
తరంగిణియను కాశ్మీరరాజచరిత్రమున మహాభారత
యుద్ధము కల్హణ పండితునిచే సంస్కృతమున వ్రా
యబడినటుల కలియుగము 654వసం॥ రమున బి. సి
2448వసం॥ రమున జరుగలేదనియు కలియుగారంభము
జ్యోతిస్సిద్ధాంత ప్రకారమున బి. సి. 3102వసం॥ రము
కాదనియు 1177 అనియు తత్పూర్వము ద్వాపరాం
తమున 17సంవత్సరముల క్రిందట అనగ బి. సి 1194వసం
రమున జరిగినదనియు వ్రాయబడియున్నది.

ఇందునుగురించి విచారింతము:—

(1) ఏరు కాశ్మీరము నేలిన రాజులలో వృద్ధ
మగోనందుడు పాండవ యుధిష్ఠిరునకు సమకాలీనుడ

వియు తృతీయగోనందునకు ముందు రాజ్యము చేసిన యభిమన్యునకు 126సం॥ రములకు పూర్వము ప్రథమగోనందుడు రాజ్యము చేసినటులను కల్హణపండితుని గ్రంథమున గనబడుచుండుటవలన నభిమన్యుడు కానిష్క కుమారుడనియు కానిష్క క్రీస్తుశకము 78వసం॥ రమున రాజ్యముచేసినటులను క్రీస్తుశకము 78వసం॥రమున నారంభింపబడిన శాలివాహనశకము తనివలననే యారంభింపబడినటులను నాంగ్లేయచరిత్రకారులు నిశ్చయించుటవలనను కానిష్కకుమారుడగు నభిమన్యునకు 1263సం॥ రములకుపూర్వము పాండవయుధిష్ఠిరుడు రాజ్యముచేసినటుల గనబడుచున్నందున పాండవ యుధిష్ఠిరుడు క్రీస్తుశకమునకు (1263-78)పూర్వము 1190వసం॥ర ప్రాంతమున రాజ్యము జేసెనని వ్రాసిరి:—

ఇందు విషయమై ముందు విచారింతము.

కల్హణపండిత కృతరాజతరంగిణివలన తృతీయగోనందుడు మొదలు కాశ్మీరము నేలిన రాజుల కాలమును గణింపగ కల్హణపండితునివరకు సుమారు 2330సం॥ రములయినటుల గనబడుచున్నది

ఇరితియోగాళ్ కల్హణపండితుఁ డభిమన్యుని రా జ్యాంతకాలమునుండి తనకాలమువరకు 2330సం॥ ములద్యోతని వ్రాసియుఁడెను. కల్హణపండితుని కాలమిప్పటికి (క్రీస్తుశకము 19౧8వసంవత్సరమునకు) 758సం॥ రమ్ములైయున్నది. దీనింబట్టి యిప్పటికి తృతీయగో నందునకు పూర్వము రాజ్యము చేసిన యభిమన్యుడు 3088సం॥ రములక్రిందట రాజ్యముచేసినటుల వ్యక్త మగుచున్నది.

ఈ యభిమన్యుని రాజ్యాంతము మొదలిడి వ రకు 3038సం॥ రములలో క్రీస్తుశకము 1908సం॥ ర ములుతీసివేయగ క్రీస్తుశకారంభమునకు పూర్వము 1180సం॥ రముల క్రిందట నభిమన్యుడు రాజ్యము చేసినటుల స్పష్టమగుచున్నది. ఇందుదహరించబడి న కానిష్కుఁడభిమన్యునకు పూర్వుడగుటచే బి. సి. 1180సం॥ రములకు పూర్వముు రాజ్యము చేసినటుల వ్యక్తమగుచున్నది.

ఇటులుండగ, నిందుదహరించిన కానిష్కు ఏ. డి. 78వసం॥రములో రాజ్యము చేసెననుటయెట్లు సం భవమగుచున్నది.

ఇదిగాక నిందదహరించిన కానిష్క కాల ముందున్న లోకధాతునకు 150సంవత్సరములకు పూర్వము బుద్ధుడగు శాక్యసింహుడు నిర్వాణము నొందెనని రాజతరంగిణివలన గనబడుచున్నది.

వీరు వ్రాసిన ప్రకారము బుద్ధుడు క్రీస్తుశకమునకు పూర్వము 544వసంవత్సరప్రాంతమున నిర్వాణముపొందినను తత్కాలమునకు ఇటీవల150వసంవత్సర ప్రాంతమునరాజ్యము చేసినకానిష్కా బి సి394వసంవత్సరప్రాంతములో రాజ్యము చేసినటుల చెప్పకతీరదు.

ఇంతియగాక ప్రథమగోనందుడు మొదలు కాశ్మీరమునేలిన రాజులలో తొంబదయిదవ వాడగు లలితాదిత్యుడు కానిష్కునకుదరిమిలాను 1650వసంవత్సర ప్రాంతములో రాజ్యము చేసినటులను ఈలలితాదిత్యుడు కాన్యకుబ్జాధిపతియగు యశోవర్మను జయించి తదాస్థానస్థితులగు వాక్పతి, రాజర్షి, భవభూతి మొదలగు కవిశ్రేష్ఠులను తనయాస్థానమునకు జేర్చుకొనినటులను రాజతరంగిణివలన స్పష్టముగ గనబడుచున్నది.

ఏ. డి 1150వసంవత్సరమున రాజతరంగిణి రచించి

నసిద్ధాంతశిరోమణిలో భవభూతిని నుదహరించి యు
న్నారు అందువలన భవభూతికాలమునం దే లలి
తాదిత్యుడు ఎ. డి 1150వసంవత్సరమునకు పూర్వమున
కాశ్మీరమును పాలించినటుల వ్యక్తమగుచున్నది.
ఇంకనుబట్టి యిందుదహరించిన కానిష్కునుండి లలి
తాదిత్యుని కాలమువరకు అయిన 1650సం॥రములలో
పైనుదహరించిన1150 సం॥రములు తీసివేయగ బి. సి
500సం॥రములకు పూర్వము కానిష్కు రాజ్యముచే
సినటుల చెప్పకతీరదు.

ఇదియునుంగాక ఈకానిష్కు ఎ. డి78వ సంవత్స
రమున రాజ్యముచేసినయెడల కానిష్కు మొదలు ల
లితాదిత్యునివరకగు 1650సం॥రములలో 78 కలిపిన
ఎ.డి 1728వసం॥ర ప్రాంతములో లలితాదిత్యుడు రా
జ్యము చేయవలసియున్నది.

అటులయినచో ఎ. డి పదిరెండవశతాబ్దము
లో కల్హణపండితునిచే రచింపబడిన రాజతరంగిణిలో
శ్రీలలితాదిత్యుని చరిత్ర వ్రాయుటకెటుల సందర్భ ప
డును?

కాబట్టి రాజతరంగిణిలో నుదహరించిన కా

విహ్యాక్షు ఎ. డి78వసం॥రము లో రాజ్యము చేసెనుట
యెంతమాత్రము సందర్భపడునటుల కనబడదు.

కావున బి. సి। 180వసం॥ర ప్రాంతమున రాజ్య
ముచేసిన యభిమన్యునికి పూర్వము కాశ్మీరమునేలి
న రాజులలో నేబదిరెండవవాడగు ప్రథమ గోనందు
నకు సమకాలీనుడగు పాండవ యుధిష్ఠిరుడు బి. సి
1190వసం॥ర ప్రాంతమున రాజ్యము చేసెననుట సరి
గ్గనునదగ కనబడదు.

2 వరాహమిహురుడు తన బృహత్సంహిత
యందు వ్రాసిన

శ్లో ''ఆసన్మఘాసుమునయశ్శాసతి పృధ్వీంయు
ధిష్ఠిరే నృపతౌ॥ షడ్ద్వికపంచద్వియుతశ్శకకాలస్తస్య
రాజ్యస్య।

అనువృద్ధగర్గుని శ్లోకమునకు కల్హణపండితుడు అ
ర్థము చేసెననియు వృద్ధగర్గుని కాలమునే కాలని
ర్ణయము చేయుటకు బుద్ధనిర్వాణ శకమునకు, సప్తర్షి
మండలగతియు, దప్ప నీశ్వరుడు పాడుకతోనున్న యు
ధిష్ఠిరాది శకములపుడు వాడుకలో లేనందున వేరుసా
ధనములెవ్వియు లేవనియు వచించుచు నితరార్యులకే

పూనదిక్కులు బుద్ధనిర్వాణకాలమునకు ౯౦౦ సం॥ర ములు గడచినట్లుగ గనబడుచుండుటవలనను బుద్ధుడు క్రీస్తుశకమునకు పూర్వము 544వ సం॥ర ప్రాంతమున నిర్వాణము నొందెనని యూరోపియను చరిత్రకారులు స్థిర పరచుటవలనను పాండవయుధిష్ఠిరుడు క్రీస్తుశకమునకు పూర్వము 1194 సం॥ర ప్రాంతమున రాజ్యము చేసెనని వ్రాసిరి.

ఏతద్విషయమై విచారింతము.

శ్లో॥ “యస్యాః పాదే ప్రథమే ద్వాదశ మాత్రా
స్తథా తృతీయేపి॥ అష్టాదశ ద్వితీయే పంచదశ చ
తుర్థకే సార్యా॥

అను నార్యా లక్షణోక్తప్రకారము తురీయ చరణ మున పదునైదు మాత్రలుండవలసియున్నది.

“ వా పాదాంతో లఘుర్గురుః॥

అను న్యాయము ననుసరించి యీయార్యతుద నున్న “స్య” అను నక్షరమునకు రెండుమాత్రలు గణింపవలసియున్నది. అటుల గణించిన తురీయచరణమున పదునైదు మాత్రలు గనబడుచున్నవి కాని మాత్రా చ్యుతము గనబడదు.

"శకకాలస్తస్యరాజ్యస్య"

అనునపుడు తురీయచరణము గమనించునటుల

"శక్యకాలస్తస్యరాజ్యస్య"

అనునది గమనించక పోవుటయేగాక విస్మృతిగ గనబడుచున్నది. శబ్దశాస్త్రాదులు చెకింపుగ నుండునటుల నేర్పరుచుచున్నవి గాన "శకకాలః" అనుపదియె యనుకూలముగ దోచుచున్నది.

"షడ్ద్వికపచద్వి" అను సమాసపదమునందలి ద్వికపదము సంఖ్యావాచకముగ ప్రయోగించి యుండవచ్చును

---

వీనిమాత్రాఛందఃపరిష్కారమును యోచింపకపోయినను

శ్లో॥ గణాశ్వతుల్యఘోషితాః
పంచార్యాదిషుసంస్థితాః

అనురీతిని పఠించిన రగణముక్యాగాజేయునని యెంచకపోవునుగదా- మఱియు-

కముగ వ్రయోగించియుండవచ్చును.

అటులగాక "ద్వికీ" పదము పరిమాణ వాచక ముగ యోచించి రెండు రెట్లని యర్థము చేసినను "షడ్ద్వికీ" అను పదమునకు "షడావృత్తంద్వికంషడ్ద్వికం" అను వ్యుత్పత్తివలన నారురెట్లు పన్నెండని యర్థమిచ్చును గాని యిరువదియారురెట్లని యర్థము శే యుట న్యాయముగ గనబడదు.

దీనినిబట్టి "షడ్ద్వికపంచద్వి" అను పదమునకు "నవపంచచవర్గాణి" మొదలగు వానివలె ముప్పదియే యని యర్థము జేయవలసియున్నదిగాని 650 అని యర్థము జేయుట న్యాయముగ గనబడదు

"ద్వికీ" పదము సంఖ్యావాచకముగ ప్రయోగించునపుడు యుధిష్ఠిరశకకాలపరిమితి 2526 సం॥రములనియు పరిమాణవాచకముగ ప్రయోగించినపుడు యుధిష్ఠిరుడు రాజ్యము చేసినకాలము 37 సం॥రములనియు వృద్ధగర్గుని యభిప్రాయముగ గనబడుచున్నది.

కల్హణ పండితుడు సంఖ్యావాచకమను నభిప్రాయము నొందెను.

ఇందుకుపష్టంభకముగ

“షడ్ద్వికపంచద్వి మిత్ర్యేక కాలస్య స్వరాజ్ఞశ్చ”।

అనుపాతము గలదు పరిమాణవాచక మగున షడు పైనివ్రాసిన యర్థమునకు గాంధారి శాపము సహకారిగనున్నది.

ఖమండలములో సప్తర్షి మండలము నలుబది భాగలవరకు వ్యాపించి యుండుటవలన నీ యార్య యందలి “మఘాసు” అను బహువచనమునకు కపింజలాధికరణన్యాయమును బట్టి మూడు నక్షత్రములని యు శృంగగ్రాహి న్యాయము ననుసరించి ముందు వెనుకలకు ॥సూ॥ గర్భాష్టమేషు బ్రాహ్మణముపనయీత” అను ఆపస్తంబ సూత్రార్థమువలె పుష్యమి మొదలు ఉత్తర ఫల్గుణ్యంతమువరకు అయిదు నక్షత్రములలో నాకాలమునకు మూడునక్షత్రములందున్నదని కనబడుచున్నది.

ప్రకృతము సప్తర్షి మండలము మఘానక్షత్రము మొదలు ఉత్తర ఫల్గుణ్యంతమువరకు వ్యాపించి యున్నటుల గనిపించుచున్నది

యుధిష్ఠిరుని కాలమున మఘ మొదలు ఉత్త

ర ఫల్గున్యంతమువరకు వ్యాపించి యున్నదని యో
చించిన నిదివరకు సప్తర్షి మండల మొకపర్యాయము
గాని రెండుపర్యాయములుగాని భగణపూర్తి చేయ
వలసియున్నది.

శ్లో॥ ఋక్షాత్కృత్తింశతెనాబ్దైః॥

అనుశ్లోకోక్త ప్రకారము గణింప 2700సం॥రములుగాని 5400 సం॥ రములు గాని అయియుండక తీరదు

పుష్యమి మొదలు మఘాంతమువరకు వ్యాపించినదని యోచించినచో భగణపూర్తి యయిన రెండు నక్షత్రము లతిక్రమించవలసియున్నది

దీనింబట్టి గణింపగ 2900సం॥రములు గాని 5600సం॥రములు గాని కావలసియున్నది.

కలియుగమున నిప్పటికి (1908సం॥రమునకు) 5009 సం॥రములు గతించెనని జ్యోతిశ్శాస్త్రవేత్తలును 3100సం॥ రములు గతించెనని నవనాగరికులును చెప్పుచున్నారు. కాబట్టి సప్తర్షి సంచారము ననుసరించి చూచిన గలియుగకాలము నెవరిచే జెప్పబడిన కాలమునకును సరిగగనబడదు.

ఇదిగాక సప్తర్షి మండలమొక శతాబ్దమునకొక నక్షత్రమును విడుచునెడల ముప్పదిసం॥రములకు నాలుగు భాగల కోణమధికము గావలసి యున్నది.

నేనిదివరకు ముప్పది సం॥రములనుంచి యీ మండలగతిని పరిక్షించుచుంటిని గాని యిదివరకొక భాగమైన కోణము జేసినటుల గనబడలేదు. కాబట్టి సప్తర్షి మండలమొక శతాబ్దమునకొక నక్షత్రమును విడుచు ననునది సరిగ గనబడదు.

సప్తర్షి మండల సంచారము ననుసరించినా చెదము. విష్ణుపురాణము 4వఅంశము 24వఅధ్యాయములోని

శ్లో॥ తేతు పారిక్షితేకాలె
మఘాస్వాసన్ ద్విజోత్తమ॥

అను 24వశ్లోకములోని యుత్తరార్థమువలనను భాగవతము 12 వస్కంధము 2వ అధ్యాయములోని

శ్లో॥ తేత్వదీయె ద్విజాః కాలె
చాధునాచా శ్రితామఘాః"

అను 28వశ్లోకములోని యుత్తరార్థము వలనను పరిక్షిత్కాలమున ఋషిమండలము మఘానక్షత్రము

న నున్నటుల గనబడుచున్నది. విష్ణుపురాణము 4వ అంశము 24వ అధ్యాయములోని

శ్లో॥ ప్రయాస్యంతి యదాచైతే
పూర్వాషాఢాం మహర్షయః। తదా
నందాత్ప్రభృత్యేష కలిర్వృద్ధిం గమిష్యతి॥

అను 30వ శ్లోకమువలనను భాగవతము 2వ స్కంధము 2వ అధ్యాయము లోని

శ్లో॥ యదామఘాభ్యో యాస్యంతి
పూర్వాషాఢాం మహర్షయః। తదానందా
త్ప్రభృత్యేష కలి ర్వృద్ధిం గమిష్యతి॥

అను 32వ శ్లోకము వలననా ఋషి మండలము నందుని కాలమునకు పూర్వాషాఢా నక్షత్రమున చేరునటుల గనబడనున్నది. విష్ణుపురాణము 4వ అంశము 24వ అధ్యాయములోని.

శ్లో॥ తేనసప్తర్షయో యుక్తా
స్తిష్ఠంత్యబ్దశతంనృణాం॥

అను 25వ శ్లోకములోని పూర్వార్ధము వలన నాఋషి మండలమొక్కొక నక్షత్రమున నూరుసంవత్సరములుండునని కనబడుచున్నది. అందుచేతబట్టి మఘ మొదల

లు పూర్వాషాఢవరకు పదినక్షత్రములకు 1000 సం॥
రములకట్టచే పరీక్షిత్తు మొదలు నందునివరకు వేయి
సం॥రములగును.

విష్ణుపురాణము 4వ అంశము 24వ అధ్యాయములోని

శ్లో॥ యావత్పరీక్షితో జన్మ యావన్నం
దాభిషేచనం। ఏతద్వర్ష సహస్రంతు జ్ఞే
యం పంచాశదుత్తరం॥

అను 23 వ శ్లోకమువలన పరీక్షిన్నందాంతర కాలము 1050 సం॥రములగును భాగవతము 12వ స్కంధము 2వ అధ్యాయములోని.

శ్లో॥ ఆరభ్య భవతో జన్మ యావన్నందాభిషేచనం।
ఏతద్వర్ష సహస్రంతు శతం పంచదశోత్తరం॥

అను 26 వ శ్లోకమువలన 1115 సం॥రములుగను గనబడుచున్నది. విష్ణుపురాణములోని పై శ్లోకము నందలి తురీయచరణములోని॥ పంచాశదుత్తరం॥ అను వాక్యము॥ పంచశతోత్తరం॥ అనియు॥ పంచదశోత్తరం॥ అనియు మరిరెండు పాఠములున్నటుల శ్రీధరీయ విష్ణుచిత్తీయ వ్యాఖ్యానముల వలన గనబడుచున్నది అందు॥ పంచశతోత్తరం॥ అను పాఠము వాస్తవ మయి

సదిగను పయునిగనపరచిన విష్ణుపురాణము 4 అం 24 అ॥ 30వశ్లోకము లోనియు భాగవతము 12 స్కం 2 అ॥ 32వ శ్లోకములోనియు పూర్వాషాఢా॥ అనువాక్యముపూర్వాషాఢా॥ అనియు పైఅధ్యాయము 26వ శ్లోకములోని॥శతంపంచదశోత్తరం॥ అనుతురీయచరణము ॥జ్ఞేయంపంచశతోత్తరం॥ అనియునుండునటుల నుపోలుచున్నది.

ఏలనన:—

విష్ణుపురాణము 4 అం॥ 23వ అధ్యాయము వలనమాగధులు 1000 సం॥ రములును24వఅధ్యాయములోని 1,2 వాక్యములవలన ప్రద్యోతులు 136 సం॥ రములును శిసునాగులు 362 సం॥రములునురాజ్యము చేసినటులను భాగవతము 9వస్కంధమున మాగధులు 1000 సం॥రములును 12 స్కం॥ 1 అ॥ వకటి మొదలు యేడువరకుగల శ్లోకములవలన ప్రద్యోతులు 138సం॥రములును శిసునాగులు 360 సం॥ర ములునురాజ్యము చేసినటులను గనబడుచున్నది. ఇందునుబట్టి పరిక్షుత్సమ కాలీనుడగు సోమాపి మొదలు మహాపద్మనందునివరకు సుమారు 1500 సం॥ రముల

గ గనబడెను.

ఇదిపైనివ్రాసిన విష్ణుపురాణము 4అం॥24అ 23వశ్లోకములోని "పంచాశదుత్తరం" అనువాక్యమునకును,, పంచదశోత్తరం" అనుపాఠమునకును 31వశ్లోకములోనియు భాగవతము 12స్కం॥ 2అ 32వశ్లోకములోనియు॥పూర్వాషాఢాం॥ అనువాక్యమునకును పై అధ్యాయము26వశ్లోకములోని" శతంపంచదశోత్తరం" అను వాక్యమునకును విరుద్ధముగ నున్నదిం కాబట్టి,, పంచాశదుత్తరం,, అను వాక్యమును,, పంచదశోత్తరం" అను పదమును " పంచశతోత్తరం" అనియు,, శతంపంచదశోత్తరం" అనుతురీయ చరణమును" జ్ఞేయం పంచశతోత్తరం" అనియు "పూర్వాషాఢాం" అను వాక్యము॥ పూర్వాభాద్రాం" అనియుమార్చిన శ్రీమద్భాగవత విష్ణు పురాణ గ్రంథములందలి వాక్యములకు పరస్పర విరోధములు లేక యేకరీతిగనుండును. ఇదిగాక వాయు పురాణమున జెప్పబడియున్న" సార్ధసహస్రం" అనువాక్యముతో సంబంధించి యుండును. గావున విష్ణుపురాణము 4అ॥ 24.౨। 23వశ్లోకము" పంచశ

త్రోత్రం॥ అనియు అందలి 30వ శ్లోక మును భాగవత ము 12స్క 12అ 32వ శ్లోకము। పూర్వాభాద్రాం ,, అనియు పై అధ్యాయము 26వ శ్లోకము, జ్ఞేయంపంచ శతోత్తరం॥ అనియు పుట్టి పిమ్మట పాఠభేదమునగల ,, శత" పతు" రశ" అనుమూడు శబ్దములలోని ప్రతి శబ్దమునందలి యక్షరద్వయమునకు వర్ణవ్యత్యయ మెగాని వర్ణములకు విశేషభేదము లేకుండుటవలన ను" పూర్వాషాఢా" పూర్వాభాద్రాం" అనువా క్యద్వయములోని ప్రతివాక్యమునందలి వర్ణచతుష్ట యములో మొదటిరెండువర్ణములును సమానముల గుట వలనను తుదరెండువర్ణములును తుల్యస్వరూప ము లగుటవలనను లేఖకాది ప్రమాదములచే మార్పు కలిగినటుల నూహింపదగియున్నది.

కాబట్టి శ్రీమద్భాగవత విష్ణుపురాణముల లోని,, శతం పంచదశోత్తరం,, జ్ఞేయంపంచాశదు త్తరం,. అనువాక్యములు,, జ్ఞేయంపంచశతోత్తరం అనియు,, పూర్వాషాఢాం, అనునది,, పూర్వాభా ద్రాం., అనియునుండునటులతోచుచున్నది,,పూర్వా భాద్రాం,, అను పాఠమునసనుసరించి చూచినయెడ

మొదలు పూర్వాభాద్రవరకు పదునైదు నక్షత్రములు గను ఋషిమండల మొదటి నక్షత్రమున నూరు సంవత్సరములుండుటచే 1500 సంవత్సరములగును గాన పరీక్షిన్నందాంతర కాలము 1500 సంవత్సరములుగ గనబడును.

విష్ణుపురాణము 4 అం॥ 24 అ॥ లోని 5, 6, 7 శ్లోకములలోను భాగవతము 12 స్కం॥2 అ 7.8.9.10 11.12 శ్లోకములలోను మహాపద్మనందుడును వాని సంతతివారును నూరు సంవత్సరములు భూమినేలెదరనియు చాణక్యుడను బ్రాహ్మణుడు నందవంశోన్మూలనము జేసి చంద్రగుప్తునికి రాజ్యమిచ్చుననియు అశోకవర్ధనుడు చంద్రగుప్తునికి పౌత్రుడనియు చెప్పబడియున్నది.

ఇందునుబట్టి పరీక్షిత్తు మొదలు చంద్రగుప్తుని రాజ్యారంభమువరకు పై ప్రకారము ॥పూర్వాషాఢాం, అనుపాఠము ననుసరించి 1100 సంవత్సరములుగను॥ పూర్వాభాద్రాం,, అనుపాఠము ననుసరించి 1600 సంవత్సరములుగను గనబడుచున్నది.

చరిత్రకారులు అశోకుడు బి సి. 270 సంవత

ఖులక్రిందట రాజ్యము చేసినటుల నిర్ణయించిరి.

పరిక్షిత్పితామహుడగు యుధిష్ఠిరుడు పరిక్షిత్తుకు పూర్వమునను అశోకుని పితామహుడగు చంద్రగుప్తుడు అశోకునికి పూర్వమునను రాజ్యము చేసియుండవలసి యున్నది.

కావున దీనింబట్టి గణింపగ పాండవయుధిష్ఠిరుడు బి. సి. 1900సం॥ రములకు పూర్వము గాని 1400సం॥ రములకు పూర్వముగాని రాజ్యము చేసియుండవలయును.

ఇదిగాక ప్రకృతము ఋషిమండలము మఘ మొదలు ఉత్తర ఫల్గుణ్యంతమువరకు వ్యాపించి యుండుటవలనకైని నేను గనపరచిన ప్రకారము పాండవ యుధిష్ఠిరని కాలమిప్పటి కిరువదిరెండొమ్మిదివందల సం॥ రములకు తక్కువగ నున్నటులగనబడుచున్నది.

పాండవయుధిష్ఠిరుని కాలము మొదలిప్పటికైన 2900 సం॥ రములలో నిప్పటి క్రీస్తుశకము 1908 సం॥ రములుతీసివేయగ క్రీస్తు శకారంభమునకు పూర్వము 992వ సం॥ రప్రాంతమున పాండవ యుధిష్ఠిరుడు రాజ్యము చేసినటుల గానబడుచున్నది.

కాబట్టి బి. సి. 1194వ సం॥ర ప్రాంతమున రాజ్యము చేసెననుట యసంభవము.

ఇదిగాక వీరు చేసిన యూర్యార్థము ననుసరించి బుద్ధునికి పూర్వము 650 సం॥ రములనినను సరియైనదిగా గనబడదు.

ఏలనన

రాజతరంగిణిలో నుదహరించిన కానిష్క కాలమునకు 150సం॥ రములకు పూర్వము బుద్ధుడు నిర్వాణము నొందినట్లు రాజతరంగిణివలన వ్యక్తమగుచున్నది.

అభిమన్యుడు బి. సి. 1180 సం॥రములకు పూర్వము రాజ్యము చేసినట్లు పైని గనపరచితిని.

అభిమన్యునికి పూర్వము రాజ్యము చేసిన కానిష్క కాలమునకు బుద్ధుడు 150 సం॥రములకు పూర్వము నిర్వాణము నొందుటచే బి. సి. 1330 సం॥రములకు పూర్వుడని చెప్పక వీలులేదు.

వీరు వ్రాసిన యూర్యార్థప్రకారము బుద్ధునికి పూర్వము 650 సం॥ రముల క్రిందట రాజ్యము చేసిన పాండవయుధిష్ఠిరుడు బి. సి. 1330 + 650 = బి. సి. 1980 సం॥ రములకు పూర్వము రాజ్యము చేసినను

దియున్యక్తము.

కాశిట్టి పాండవ యుధిష్ఠిరుడు బి. సి. 1190 వ సం॥ర పాంతమున రాజ్యము చేసెననుటది యెంతమా త్రము సంధర్భించినటులగనబడదు

(3) ఆర్యభటుడు కాలసంకలిత ప్రకరణమునందు కలియుగము 1910వ సం॥రమున ఋషిమండలము మఘానక్షత్రమున నున్నటుల వ్రాసెననియు నానక్ష త్రమునఋషిమండలముండుకాలము యుధిష్ఠిరుని కా లమగుటవలనను నాకాలము బి సి. 1190వ సం॥ర మునకు సరియైన దగుటవలనను నా సం॥ర ప్రాంత మున యుధిష్ఠిరుడు రాజ్యము చేసెననియు వ్రాసిరి. కానియిందుకాధారములు గనబడవలేదు.

ఇందువిషయమై యోచించెదము

ఆర్యభటుడుదశగీతిసూత్రములలో నాల్గవసూత్రమున

॥సూ॥ కల్పాదేర్యుగపాదాః గచగురుదిన సాచ్ఛభారతాత్పూర్వం ॥

అనిజెప్పుటవలనయుధిష్ఠిరుని కాలమువరకుభూ క్తమయినమూడు యుగపాదములు గతించినటుల గనబ డెను.

ఆర్యాష్టోత్తరశతము లోని

॥సూ॥ షష్ట్యబ్దానాంషష్టిర్యదావ్యతీతాస్త్ర
యశ్చ యుగపాదాః। తథైకావింశతిరబ్దాస్త్రిరిహామ
మజన్మనోతీతాః॥

అనుపదియుపసూత్రిమువలన తమగ్రంధరచన కాలమునకు నాల్గవయుగపాదమగు కలియుగము 3623 సం॥ రములు గతించినవని కనబడుచున్నది. ఇందునుపట్టి యీగ్రంథము ఏ డి 521 సం॥ రమున రచింపబడినటులను నాకాలమునకు 3623 సం॥ రముల కుబూర్వము యుధిష్ఠిరుడురాజ్యము చేసినటులనుగ నబడుచున్నది.

కావునపైనుదహరించిన యార్యభటుని గ్రంధమునుబట్టి బి. సి 3102సం॥ రములకు పూర్వముపాండవయుధిష్ఠిరుడు రాజ్యముచేసినటుల గనబడుచున్నది గాని 1194వ సం॥ రప్రాంతమున జేసినటుల గనబడదు. కాబట్టి ఆర్యభటుడు కలియుగము 1910వ సం॥ రము నబుధమండలము మఘానక్షత్రమునమున్నటుల వ్రాసియుండడు.

ఆర్యులవ్రాసి యున్నయెడల నామఘల

ము బి సి. 3102 సం॥ రములకు పూర్వము మొదటి లుకలియుగము 1910వ సం॥రమునకును నిప్పటికినిమ ఘానక్షత్రముననే యున్నటులమనమూహింపదగియు న్నది ఈమండలగతి సరియైనదిగా గనబడలేదని పైని గనుబరచితిని. ఈమండలసంచారవిషయమై కాలస్వ రూపోపన్యాసమున విపరించి యుంటిని.

(4) అంపశయ్యయందు త్తరాయణ పుణ్యకాలము ననిరీక్షించుచున్న భీష్ములు ధర్మరాజునుగూర్చిపలికిన

శ్లో॥ మాఘోయంసమనుప్రాప్తః। మాస స్సౌమ్యోయుధిష్ఠిర।త్రిభాగ శేషఃపక్షో యంశుక్లోభ వితుమర్హతి॥

అనుశ్లోకమునందలి॥త్రిభాగ శేషఃపక్షోయం॥ అనువాక్యమునకు మాఘశుక్ల పంచమియను నర్థము జేసియాకాలమున నాదినమున నుత్తరాయణ ప్రవే శమయినదని నిశ్చయించి నాటిదినమాది ఒక్కొక శాఖయొక్కొకదినమననువిడుచుచు నేకాదశినాడు స్వర్గస్థుడాయెననిమహాభారతము నందున్నదనియు వే దాంగజ్యోతిషమున నైదేండ్లకొక పర్యాయ ముత్త రాయణ మమావాస్యయంద పూర్వులందురిలు ధని

స్థానక్షత్రముని జేరియుండగ ప్రవేశించుననియు కలి యుగ ప్రారంభమునపడియయనములును, చంద్రుడు ధనిష్ఠ, చిత్ర, ఆర్ద్ర, పూర్వాభాద్ర, అనూరాధ, ఆశ్లేష, అశ్విని, పూర్వాషాఢా, ఉత్తరఫల్గుణి, రోహిణి అనుపదినక్షత్రములను జేరియుండగ ప్రవేశించినవని చెప్ప బడియున్న దనియు అందువలనమహాభారతయుద్ధము జ రిగినకాలమున మాఘశుక్లపంచమినాడు జరిగిన యు త్తరాయణము అశ్వినిలో చంద్రుడున్న పుడుప్రవేశమై నను త్తరాయణముతో సంబధించియున్న ందునఅయిదు సం॥ రములయుగమందు ప్రవేశమయిన అయిదు త్త రాయణములలో నాల్గవదగుటచే నాయుగములో నాల్గవ సం॥ రమనియు, మరియుభీష్ములు నిర్యాణము నొందినయు త్తరాయణము ప్రవేశించిన అయిదుసం॥ రములయుగము కలియుగప్రారంభము మొదలు నాల్గవదియగుటబట్టియు కలియుగముకే స్తుశకము న కు బూర్వము 1177 వసం॥రమున ప్రారంభించినట్లు వే దాంగజ్యోతిషమునుబట్టియు బురాణాద్యనేక గ్రంథ ములనుబట్టియు ప్రబలనిదర్శనములు గనబడుటవల నను మహాభారతయుద్ధము క్రీస్తుశకమునకు బూర్వ

క్రీ॥ 1194 సం॥ర ప్రారంభమున జరిగినదని నిశ్చయింపవలెనని వ్రాసిరి.

ఇంతియగాక వేదాంగజ్యోతిషమున సూర్యుడు ధనిష్ఠా నక్షత్రమున నుండగ నమావాస్యయందుత్తరాయణమగునటుల చెప్పుటవలనను పైనుదహరించిన మహాభారతశ్లోకమునుబట్టి మాఘశుక్ల పంచమి నాడుత్తరాయణమగునటుల గనబడుటవలనను నా పంచమికి పూర్వమునందగు నమావాస్య (పుష్యామావాస్య) నాడు సూర్యచంద్రులు శ్రవణనక్షత్రమున చేరియుండవలయుననియు నా పంచమినాడు ప్రవేశమయిన ఉత్తరాయణమున చంద్రుడు రేవతీనక్షత్రమున నుండవలయుననియు మాఘశుక్ల పంచమినాడుత్తరాయణము ప్రవేశించునపుడు రేవతీనక్షత్రమున నుండవలసిన చంద్రుడశ్వినీ నక్షత్రమున నున్నటుల వ్రాయబడిన వేదాంగజ్యోతిషమునందలి ప్రమాణము కాలమునందలి నక్షత్రగతిని సరిగ గనిపెట్టియుండక పోవుటచే సంభవించిన స్ఖాలిత్యమని గణింపవలసి యున్నదనియు వ్రాసిరి.

ఇందును గురించి విచారింతము.

॥మాఘోయం॥ అనుశ్లోకము భీష్మనిర్యాణ తిథిని తెలియచేయుచున్నదిగాని ఉత్తరాయణప్రవేశదినమును తెలియచేయలేదు ఆతిథియందుత్తరాయణము ప్రవేశించినటుల శాంతిపర్వము 47వ అధ్యాయములోని.

శ్లో॥ భీష్మస్యకురుశార్దూలదేహాత్స
ర్గంమహాత్మనః। నివృత్తమాత్రేత్వయనే
ఉత్తరేవైదివాకరే॥

అనువాదపశ్లోకము వలన వ్యక్తమగుచున్నదిగాని యాతిథిపంచమియనుట కవకాశమియ్యదు.

ఏలనన

"మాఘోయం" అనుశ్లోకములోని "త్రిభాగశేషఃపక్షోయం" అనువాక్యమునకీపక్షము త్రిభాగశేషము గలదనియర్థము॥ ఇందలి త్రిభాగశబ్దము మూడవభాగమనియు మూడుభాగములనియు నర్థద్వయమునిచ్చుచున్నది.

అందు రెండవయర్థము సరియైనదిగ నెంచుకొని పంచమియను భ్రమనొందిరి.

అర్థద్వయమునమనుసరించి విచారించినను శని

ఛమితిఫి సంభవింపదు.

పలనన

సూర్యచంద్రసంయోగము దర్శాంతమనియు సూర్యచంద్ర షడ్రాశ్యంతరము పూర్ణిమాంతమనియు సూర్యచంద్ర ద్వాదశ భాగాంతరమొక చాంద్రతిథియనియు శుక్లచతుర్థ్యంతమునకు సూర్యునతిక్రమించి చంద్రుడు 48 భాగల (degrees) దూరమున నుండుననియు ఖగోళశాస్త్రసిద్ధములై యున్నవి.

దర్శాంత పూర్ణిమాంతమధ్యస్త పక్షసంజ్ఞిక కాలమున కగుసూర్య చంద్రాంతరము 180 భాగల ను సమానమగునట్లుగ విభజింపగ వంతునకు 60 భాగలును నాలుగువంతులుగవిభజింపగ 45 భాగలునువగును.

మూడవభాగము, శేషమనునపుడు సూర్యుని నతిక్రమించి చంద్రుడు 120 భాగలదూరముననుమూడుభాగలు శేషమనునపుడు 45 భాగలదూరమునను నుండును.

సూర్యునినతిక్రమించి చంద్రుడు 120 భాగల దూరమున నుండునపుడు దశమ్యంతమగు నేకాదశ్యా

రంభకు 45 భాగలదూరమునకుండునప్పుడు చతు
ర్థిలో శిభుక్తమును నగును

కావున మూడవభాగమును నర్ధములో నేకా
దశియును మూడుభాగలను నర్ధములో చతుర్థియు
ను నగుచున్నవి.

కాబట్టి అర్థద్వయము నను పంచమి కనర్థము
సంభవించు చున్నది. పంచమి మొదలో కొక దిన
మున నొక్కొకప్రాణము ను విడుచు నెడల పంచప్రా
ణములును నవమితో నంతము నొందవలసియున్నది
అదియే నిర్యాణమనబడును గాన నాపక్షమున నాది
నమేకాదశియను టకవకాశమియ్యదు.

ఇది గాక భీష్మనిర్యాణతిథిని తెలియజేయుచు
న్న "మాఘోయం। అనుశ్లోకములోని" త్రిభాగ
శేషఃపక్షోయం, అనువాక్యమునకు ఈపక్షము మూ
డవభాగము శేషముగలదని యర్థము జేయవలసి
యున్నది.

ఏలనన.

మాఘశుక్లైకాదశి భీష్మైకాదశి యనునదిను
ప్రసిద్ధము. ఇంతియగాక ఆతిథియందు భీష్మనిర్యా

గున గుటవలన నాతిథి కానామము కలిగినటుల కల్పవల్ల్యాది కాలనిర్ణయ ధర్మశాస్త్ర నిబంధనగ్రంథము లందగపడుచున్నది. మూడవభాగము శేషము గలదనినచో నేకాదశికర్థమియ్యాదు. కాబట్టి యిచ్చట తిథిభాగశబ్దమునకు మూడవభాగమను నర్థము జేయ కతీరదు. అంత వలన నేకాదశియగునుగాని పంచమిగా నేరదు. కావున పైనుదహరించిన శాంతిపర్వము 47వ అధ్యాయము లోని శివశ్లోకమువలన నాకాలమున మాఘశుక్లైకాదశినాడుత్తరాయణము ప్రవేశించినటుల గనబడుచున్నది గాని పంచమినాడనుటకవకాశమీయదు.

వేదాంగజ్యోతిషమువనైదేండ్లకొక పర్యాయము సూర్యచంద్రులు ధనిష్ఠానక్షత్రమునను౦డగ నమావాస్యయందుత్తరాయణము ప్రవేశించునను యంశమునుగురించి విచారించెదము.

సూర్య చంద్ర ద్వాదశ భాగాంతరమొక చాంద్రతిథి యనునటుల చంద్రుడు మేషాదిబిందువు (first point of aries నుండి 13⅓ భాగల నతిక్రమించుటఅశ్విన్యాదిగ నుక్తైక నక్షత్రమని ఖగోళశా

ప్రసిద్ధమైయున్నది

సూర్యోదయనమును ప్రవేశించునది మొదలు తిరిగి అయిదవసంవత్సరాంతమున నా యయనమును ప్రవేశించువరకు సుమారు 1826దినములు 13½ ఘటికలగును. అందు మొదటి యయనమును బ్రవేశించువరకు మేషాది బిందువునుండి యెన్నవకలలో సూర్యచంద్రులుందురో అయిదవ పర్యాయమా యయనమును ప్రవేశించువరకు సుమారు సూర్యుడు 4కలలును చంద్రుడు 47భాగలు మొదలు 67 భాగలవరకున్ను తక్కువగనుండును కాబట్టి మొదటియయనమునుప్రవేశించువరకగు సూర్య చంద్రాంతరముకన్న అయిదవపర్యాయము ప్రవేశించు వరకగు సూర్యచంద్రాంతరము $46\frac{14}{15}$భాగలు మొదలు $66\frac{14}{15}$ భాగలవరకు తక్కువగుటచే మొదట ప్రవేశించుకాలమున నుండిన చాంద్రతిథికన్న అయిదవపర్యాయమున ప్రవేశించుకాలమునకు 4 చాంద్రతిథులు మొదలు అయిదు తిథులవరకును చంద్రుడు సుమారు 47 భాగములు మొదలు 67 భాగలవరకు తక్కువగనుండుటచే 3½నక్షత్రములు మొదలు అయిదు నక్షత్రము

లవగణను తక్కువగనుండును. అనగ మొదటివ్రేశము దర్శాంతములోనగునెడల నైదవ పర్యాయమ గుప్రవేశము బహుళద్వాదశికి పూర్వమునను దర్శారంభముననగు నెడల నేకాదశికి పూర్వమునను ధనిష్ఠాంతములోనగునెడల నుత్తరాషాఢకు పూర్వమునను ధనిష్ఠారంభములో నగునెడల పూర్వాషాఢకు పూర్వమునను గావలసియున్నదిగాని తిరిగి దర్శధనిష్ఠలలో గానేరదు.

అప్రశాస్త్రమైదుసం॥ రముల యుగములోనైదవయుగమున కొకపర్యాయముండిన నుండవచ్చును కాబట్టివేదాంగజ్యోతిషమున నటులనుండవచ్చును. గాని యైదేండ్లకొకపర్యాయ మమావాస్యయందు సూర్యచంద్రులు ధనిష్ఠా నక్షత్రమున నుండగ నుత్తరాయణమగునని వ్రాయబడి యుండదు. అటులనే నుండినయెడల నిది లేఖకాది ప్రమాదములవలననం భవించినటుల మనమూహింపవలయును. అందుకేవకాశమగుచో సౌరాదిసంవత్సరముల పరిమితి

శ్లో॥మాతులసౌశాలాతేల విమలవ...

శ్చవత్సరా॥వంచ॥

గు చెప్పినరీతిని స్థూలముగ జేప్పినటుల మనమూ
గాంపవలసియున్నది.

సూర్యుడు ధనిష్ఠానక్షత్రమున నుండునపుడు
రాయణము ప్రవేశించు కాలమున క్రాంతిపాత
quinoctial point) వక్రగతి (retrograde motion)
లో భూపుపక్ష మునసుదగయన బిందువు (winter
lstice' మకరాదిబిందువు (first pointof capricorn
) నుండి తూర్పుగ 23½ భాగలకన్న నెక్కువగను
½ భాగలకన్న తక్కువగను నుండవలసియున్న
గదా. ఆ కాలమున నశ్వినిలో చంద్రుడుండగ ప్రవే
శించు నుత్తరాయణము శుక్లపంచమియందు గా
వచ్చునుగాని తత్పూర్వమున గానేరదు అనగ తరు
గ శుక్లపంచమికి పరమునసునరుడుగ శుక్లపంచ
లోను నగునుగాని చతుర్థిలో గానేరదు.

ఏలనన

ధనిష్ఠలో సూర్యుడును నశ్వినిలో చంద్రుడును
ండగపంచమి సంభవించునుగాని చతుర్థి సంభవిం
పు.

క్రాంతిపాత పరిడోలనముగ (pendulum) తిరు

గుపక్షమున నప్పుడుదగయనబిందువు మకరాదిబిందువునుండి తూర్పుగ 23 భాగలకన్న నెక్కువగను 30 కన్నతక్కువగను నుండవలసియున్నది.

అప్పుడు సూర్యుడు మకరరాశి నతిక్రమించుటకు బూర్వమె యుత్తరాయణము ప్రవేశించును. ఆకాలమున నశ్విని లో చంద్రుడుండగ ప్రవేశించు నుత్తరాయణము శుక్లపంచమికి బరమందే యగును గాని పంచమిలోగాని తత్పూర్వమునగాని కానేరదు.

ఏలనన

మకరములో సూర్యడును నశ్వినిలో చంద్రుడును నుండగ పంచమికి బరతిథులేగాని పూర్వతిథులును పంచమియును సంభవింపవు

"త్రిభాగ శేషః పక్షోయం ॥ అను వాక్యమునకు మూడుభాగలు శేషముగలదను నర్థము జేయునప్పుడు చతుర్థిసంభవించునుగాని పంచమి సంభవింపదు.

కాబట్టి వేదాంగజ్యోతిషమున జెప్పబడినప్రకారము ధనిష్ఠలో సూర్యుడుండగ నశ్వినిలో నుత్తరాయణము ప్రవేశించునను కాలమునకును" త్రిభాగ శేషఃపక్షోయం" అను మహాభారత వాక్యమునకు

మూడుభాగలు శేషముగలదను నర్థము ననుసరించిన కాలమునకును నెంతమాత్రము సంగర్భించునటుల గనబడదు. ధనిష్ఠాద్యర్థమున సూర్యుడుండగ నశ్విని లో చంద్రుడుండునపుడు పంచమి సంభవించదు గాని యుత్తరార్థమున నుండునపుడు సంభవింపక పోదు. కాబట్టి ధనిష్ఠాద్యర్థమున నుదగయనబిందువు యుండునపుడు పంచమిలో నుత్తరాయణము కాలమున నశ్వినిలో చంద్రుడుండడుగాని ధనిష్ఠోత్తరార్థమున నుదగయన బిందువు యుండునపుడు పంచమిలో నుత్తరాయణము కాలమున నశ్వినిలో చంద్రుడుండుట యసంభవముగాదు.

శ్లో॥ ప్రపద్యేతే శ్రవిష్ఠాదౌ సూర్యా
చంద్రమసావుదక్ ।సార్పార్ధే దక్షిణార్కస్తు॥

అను వేదాంగజ్యోతిషము నందలి యయిదవ శ్లోకమున సూర్యచంద్రులు ధనిష్ఠారంభమున నుండగ నుత్తరాయణమగునని చెప్పుటవలన సూర్యచంద్రాయన బిందువులు ధనిష్ఠారంభమునను క్రాంతిపాతమేషాదిబిందువునకు తూర్పుగ 23కి భాగల దూరమున ననగా భరణీచతుర్థ చరణారంభమున నున్న

టులను దెలియుచున్నది.

క్రాంతిపాత పశ్చిమగతితో బోవుచుండుట వలన నపుడు దర్శాంతమున సూర్యుడుధనిష్ఠారంభమున కేమాత్రము తక్కువగనున్నను ప్రతిపత్తులో నుత్తరాయణమగునుగాని దర్శలోగా నేరదు.

ఆకాలమునకు చంద్రుడు ధనిష్ఠలోనుండును గాని శ్రవణములో నుండడు దర్శాంతమునకు సూర్యునికి ధనిష్ఠలోనేమాత్రము భుక్తమైనను నుత్తరాయణము దర్శాంతమునకు పూర్వము నందగును గాని పరమందుగా నేరదు.

అవునుచంద్రుడు శ్రవణమున నుండును గాని ధనిష్ఠలోనుండడు. కాబట్టి ధనిష్ఠారంభమున సూర్యచంద్రులుండగ నగునుత్తరాయణము దర్శాంతమున నే యగునుగాని తత్పూర్వాపరములయందుగా నేరదు.

క్రాంతిపాత మేషాదిబిందువునకు తూర్పుగ 23½ భాగలదూరముకన్న నేమాత్రమల్పమున్నను దర్శాంతమునకు పూర్వము నుత్తరాయణమగునపుడు సూర్యచంద్రులు శ్రవణములో నుందురుగాని ధనిష్ఠలో

నుండరు. 23½ భాగల దూరముకన్న నేమాత్రమధి కముగ నుండినను దర్శాంతమునకు పూర్వమందు ఉత్తరాయణమగునపుడు సూర్యచంద్రులు ధనిష్ఠలోనుం డురుగాని శ్రవణములో నుండరు. క్రాంతిపాత సదా గతికలదగుటవలన నుదగయనబిందువు ధనిష్ఠారంభముననిలిచియుండదు.

సూర్యచంద్రోదగయన బిందువులు ధనిష్ఠారంభమున నున్నపుడు నుత్తరాయణ కాలమునను భరణీతృతీయ పాదాంతముననున్న క్రాంతిపాత యాకాలమునకు పూర్వాపరములందవ్యన హితముగనగు నుత్తరాయణ కాలమునకు ముందు వెనుకలకు ఏబది కలలకు పైబడుచుండునుగాని యచ్చటనేయుండదు.

కాబట్టి సూర్యచంద్రులు ధనిష్ఠారంభమున నుండగ నగు నుత్తరాయణ కాలమునకు పూర్వాపరములందు దర్శలోనగు నుత్తరాయణములు శ్రవణాంతమగు ధనిష్ఠారంభమునకుముందు వెనుకలనగును. అనగపూర్వమునందగునేవి ధనిష్ఠలోను పరమందగు నేవిశ్రవణములోనునగును

ధనిష్ఠారంభమున సూర్యచంద్రులుండగ ను

త్తరాయణము ప్రవేశించు కాలమునకు పూర్వా
మార్యచంద్రులు ధనిష్ఠారంభము మొదలు తదు
రార్ధమువరకునుండగ నుత్తరాయణము ప్రవేశిం
నమావాస్య పుష్యామావాస్య యనవచ్చునుగా
యపుడుసూర్యచంద్రులు శ్రవణనక్షత్రమున జేరియు
డవలెననుటకు ఖగోళ శాస్త్రవిరుద్ధము

ధనిష్ఠలో సూర్యచంద్రులుండగ నుత్తరాయ
ణము ప్రవేశించునను నమావాస్య పుష్యమావా
యును మాఘామావాస్యయును గావచ్చును.

ధనిష్ఠోత్తరార్ధమున సూర్య చంద్రులుండ
నుత్తరాయణము ప్రవేశించునమావాస్య మాఘామా
వాస్యయును పూర్వార్ధముననుండగ నగునమావా
స్య పుష్యామావాస్యయుననగును

ఫలనన

సూర్యుడు ధనిష్ఠోత్తరార్ధముననుండగ న
నమావాస్య మాఘామావాస్యయేగాని తదితరామా
వాస్యయును పూర్వార్ధముననుండగ నగునమావా
స్య పుష్యామావాస్యయేగాని తదితరామావాస్యయ
నుగానేరదు ఇదిదర్శాంతమాసపక్షము.

పూర్ణిమాంత మాసము గల కరుక్షేత్రాది దేశములలో ధనిష్ఠార్ధమున సూర్యుడుండగా గు మావాస్య మాఘామావాస్యయును తదుత్తరా మున నుండగ నగునమావాస్య ఫాల్గునామావా స్యయు నగునే గాని తదితరామావాస్య గానేరదు

దర్శాంతమాస పక్షమున ధనిష్ఠా నక్షత్ర ములోని 11వ భాగలోను దగయనబిందువుయుం డు కాలమున పుష్యామావాస్యయందు ధనిష్ఠానక్ష త్రిమున సూర్యచంద్రులును మాఘశుక్ల పంచమి నాడు ధనిష్ఠలో సూర్యుడును నశ్వినిలో చంద్రుడు నుండగ నాపంచమిలో నుత్తరాయణ ప్రవేశమును నాకాలములో మాఘామా వాస్యయందు సూర్య చంద్రులు ధనిష్ఠానక్షత్రమున నుండగ నుత్తరాయ ణప్రవేశమునునగును.

కావున వేదాంగ జ్యోతిషమున ధనిష్ఠాద్యర్ధ మునసూర్యుడుండగ మాఘశుక్ల పంచమి నాడశ్విని లోచంద్రుడుండునపు డుత్తరాయణము ప్రవేశించిన ట్లు గనబడినదా కాలమున నక్షత్రగతిని సరిగగని పెట్టియుండక పోవుటచే సంభవించిన స్ఖాలిత్యమని

వ్రాయుట కవకాశమిచ్చును గాని ॥త్రిభాగ॥ శబ్దమున
కు మూడుభాగలను సర్థముచేసి పంచమియను భ్ర
మనొందినటుల మహాభారత యుద్ధకాలమునమాఘ
శుక్ల పంచమినా క్షత్త్రాయణముప్రవేశించినదని భ్ర
మనొంది యీకాలమునకును వేదాంగ జ్యోతిష కా
లమునకును సందర్భింపచేయు నుద్దేశముతో వ్రాయు
టకవకాశమియ్యను.

భీష్ములునిర్యాణము నొందిన పంచవర్షాత్మకయు
గము కలియుగ ప్రారంభము మొదలు నాలుగవద
నుటకును కలియుగము క్రీస్తుశకమునకు బూర్వము
1177వ సం॥ రమున ప్రారంభమయినందుకును నా
ధారము లేవియు గనబరచలేదు.

మహాభారతమునందలి "మాఘోయం" అను
శ్లోకమునుబట్టియు వేదాంగ జ్యోతిషమును బట్టియు
భీష్ములు నిర్యాణమునొందిన సంవత్సరము పంచవర్షా
త్మకయుగములో నాల్గవసంవత్సరమనియు నాయుగ
ము కలియుగప్రారంభము మొదలు నాలుగవదని
యు కలియుగము క్రీస్తుశకమునకు బూర్వము 1177వ
సంవత్సరమున నారంభించినదనియు వ్రాయుచు క్రీ

స్తుశకమునకుబూర్వము1194వసంవత్సర ప్రారంభము న మహా భారతయుద్ధము జరిగినదను నదెటులుండు నో యోచింపుడు.

వీరు వ్రాసిన ప్రకారము భీష్ములంపశయ్య నున్న సమయమున మాఘ శుక్ల పంచమి నాడు త్తరాయణము ప్రవేశించిన దనియునది పంచవర్షాత్మ కయుగమున దలి అయిదుయుత్తరాయణములలోనా లుగవ దనియు యోచించి చూచినను భీష్ములునిర్యా ణమునొందినపంచవర్షాత్మకయుగము కలియుగప్రారం భము మొదలు నాల్గవదైనచో కలియుగములో ప దునెనిమిదిసంవత్సరములు గతించినపైని మహాభార తయుద్ధము జరుగును గాని కలియుగారంభమునకు బూర్వము ద్వాపరాంతమున నెటులజరుగునో యో చింపవలసియున్నది.

బి. సి. 1177, 1194,వ సంవత్సరములలో నే దినమున నుత్తరాయణము ప్రవేసించినదియు జూచెదము.

బి.సి. 1177వసం॥రము సృష్ట్యాది సౌరసంవత్స రములు1955881925అగు స్వభాను సంవత్సరమగును

ళేగా చిత్రభాను సంవత్సరముగానితారణ సంవత్సర ముగాని గాకలేరదు.

1. సృష్ట్యాది 1955881925 సౌరాబ్దముగు స్వభానుసంవత్సరమున కురుక్షేత్రము నందలి ఫాల్గుణ బహుళ పంచమి శనివారం రోజున అర్ధరాత్రకాలమునకు మేషాదిబిందువునుండి $293\frac{2}{15}$ భాగలదూరమున సూర్యుడును $17\frac{5}{6}$ భాగల దూరమున చంద్రుడును నుండెను కాబట్టి ఆరోజున సూర్యోదయాది 54 ఘటికలకు షష్ఠి చిత్రానక్షత్ర ఘటికలలో నుత్తరాయణము ప్రవేశించెను

2 సృష్ట్యాది 195588924 సౌరాబ్దముగు చిత్రభాను సంవత్సరమున కురుక్షేత్రమునందలి మాఘ శుక్లాష్టమీ శుక్రవారంరోజు అర్ధరాత్రమునకు మేషాదిబిందువునుండి $293\frac{2}{5}$ భాగల దూరమున సూర్యుడును $36\frac{1}{30}$ భాగల దూరమున చంద్రుడును నుండెను

కాబట్టి యాదినమున సూర్యోదయాది 38ఘ

టికలను నవమీ కృత్తికా నక్షత్రములలో నుత్తరా
యణము ప్రవేశించెను

3 సృష్ట్యాది 1955881926 సౌరాబ్దమగు తారణసం
వత్సరమున కురుక్షేత్రమునందలి మాఘశుక్ల ప్రతి
పత్సోమవారం రోజు అర్ధరాత్రిమునకు మేషాది బిం
దువునుండి $293\frac{9}{10}$ భాగలదూరమున సూర్యుడును
$310\frac{1}{2}$ భాగలదూరమున చంద్రుడును నుండెను

కాబట్టి యాదినమున ప్రతిపద్ధనిష్ఠా నక్షత్రము
లలో సూర్యోదయాది ఘటికలకుత్తరాయణము ప్ర
వేశించెను.

ఈసంవత్సరమున ధనిష్ఠలో సూర్య చంద్రు
లుండగ నుత్తరాయణము ప్రవేశించెనుగాని యీసం
వత్సరము నకలియుగారంభ మనుటకవకాశములేదు.

ఏలనన

ఈసంవత్సరము మొదలు సృష్ట్యాది 1955881930
సౌరాబ్దమగు సర్వధారి సంవత్సరమువరకు నైదుసం
వత్సరములలో నగు నుత్తరాయణములు ధనిష్ఠా,
ఆర్ద్రా, విశాఖా, ఉత్తరాభాద్రా, ఆశ్లేషా నక్షత్రము
లలోనై నవిగాని వేదాంగజ్యోతిషమున జెప్పబడిన ప్ర

కారము ధనిష్ఠా, ఆర్ద్రా, అనూరాధా, అశ్వినీ, ఉత్తరఫల్గునీ నక్షత్రములవరుస ననుసరించియు వైదవసంవత్సరాంతమగు సృష్ట్యాది 1955881931 సౌరాబ్ధమగు విరోధిసంవత్సరమున కురుక్షేత్రము నందలి మాఘకృష్ణైకాదశీ మూలానక్షత్రములలో నుత్తరాయణమైనదిగాని తిరిగీ ధనిష్ఠానక్షత్రమున గాలేదు.

ఇదిగాక నీసంవత్సరమునకు పూర్వము సృష్ట్యాది 1955881925 సౌరాబ్దమగు స్వభానుసంవత్సరము మొదలు 1955881921 సౌరాబ్దమగు ప్రమాది సంవత్సరమువరకగు నుత్తరాయణములు చిత్రా, కృత్తికా, పూర్వాషాఢా మఖా, అశ్వినీ నక్షత్రములలో నైనవిగాని చిత్రా, రోహిణీ, పూర్వాషాఢా. ఆశ్లేషా, పూర్వాభాద్రా నక్షత్రముల వరుస ననుసరించి కాలేదు. ఈతిథిదర్శయును కాలేదు.

ఇంతియగాక బి సి. 1157, 1195, 1214 సంవత్సరములలో మాఘశుక్ల ప్రతిపద్ధనిష్ఠలయందుయుత్తరాయణములు ప్రవేశించినవి అవియున్నప్పటినివారిసినరీతి ననుసరించినవేగాని వేదాంగ జ్యోతిషము నజెప్పబడిన ప్రకారముననుసరించి యుండలేదు.

కాబట్టి యీసంవత్సరములందు కలియుగారంభమనుట కవకాశమియ్యదు.

బి. సి. 1194వ సంవత్సరము సృష్ట్యాదిసౌర సంవత్సరములు 1955881908 అగు అక్షయసంవత్సమగును. లేదా క్రోధనసంవత్సరముగాని ప్రభవసంవత్సరముగాని గాకతీరదు.

సృష్ట్యాది 1955881908 సౌరాబ్దమగు అక్షయసంవత్సరమున కురుక్షేత్రమునందలి మాఘశు11 శనివారంరోజున అర్ధరాత్రికాలమునకు మేషాది బిందువునుండి $293\frac{11}{20}$ భాగల దూరమున సూర్యుడును $71\frac{1}{5}$ భాగల దూరమున చంద్రుడును నుండెను.

కాబట్టి ఆరోజున ద్వాదశీఆర్ద్రా నక్షత్రఘటికలలో సూర్యోదయాది ఘ 43-0 లకు నుత్తరాయణము ప్రవేశించెను.

సృష్ట్యాది1955881907 సౌరాబ్దమగు క్రోధనసంవత్సరమున కురుక్షేత్రమునందలి మాఘశుద్ధ ద్వితీయాం సోమవారం రోజునఅర్ధరాత్రమునకు మేషాదిబిందువునుండి $293\frac{4}{5}$ భాగలదూరమున సూర్యుడు

ను302$\frac{11}{20}$ భాగల దూరమున చంద్రుడును నుండెను కాన నాఁటిరోజున సూర్యోదయాది ఘ 23 (లకు ప్రతి పద్ధనిష్ఠానక్షత్రములలో నుత్తరాయణము ప్రవేశించెను.

సృష్ట్యాది 1955881908 సౌరాబ్దమగు విభవసంవత్సరమున కురుక్షేత్రమునందలి ఫాల్గుణ బహుళ దివారంరోజున అర్ధరాత్రిమానకు మేషారంభిందువునుండి 297$\frac{17}{60}$ భాగల దూరమున సూర్యుడును 207$\frac{3}{5}$ భాగల దూరమున చంద్రుడును నుండెను.

కాన నాఁటిదినమున నవమి విశాఖా నక్షత్రములలో సూర్యోదయాది ఘ 59 లకు నుత్తరాయణము ప్రవేశించెను.

ఇందునుబట్టి బి సి. 1194వ సంవత్సరమున మాఘశుక్ల పంచమిలో నుత్తరాయణము ప్రవేశించినటులగానబడదు.

కాన 'మాఘోయం,, అను శ్లోకమునకు పైగ వ్రాసిన యర్థమున ననుసరించి చూచిన బి. సి 1194వ సంవత్సరమున భీష్మనిర్యాణమైనదనుట కవకాశమియ్యదు

బి. సి 1194 అక్షయసంవత్సరము మాఘ శు: 1 శనివారం రోజున సుత్తరాయణము ప్రవేశించెను.

మహాభారతము లోని "మాఘోయం", అను శ్లోకమునందలి "త్రిభాగ" శబ్దమునకు మొదటి యర్థమునను సరించి చూచినను నేకాదశి నతిక్రమించి ద్వాదశిలో ఘ 33-౦లు భుక్తమైనపైని నుత్తరాయణము ప్రవేశించుటవలనను నాప్రవేశమర్ధరాత్రమునకుపై బడుటవలనను నాదినమున భీష్మనిర్యాణమైనదనుట కనకాశముగనబడదు.

ఇదిగాకబి సి 1147 వసంవత్సరము మొదలు 1214 వ సంవత్సరమువరకు గలసంవత్సరములలో ధనిష్ఠలో సూర్యచంద్రులుండగ దర్శయందును అశ్వినిలో గాని రేవతిలో గాని చంద్రుడుండగ మాఘశుక్ల పంచమియందునను త్తరాయణ ప్రవేశమునుకలియుగారంభమున వేదాంగ జ్యోతిషమున జెప్పబడ్డప్రకారము ధనిష్ఠాదులలో చంద్రుడుండగ జరుగునను ప్రకారము అయన ప్రవేశములును గనబడలేదు.

కాన బి సి. 1177 వ సంవత్సరమున కలియుగారంభమును 1194 వ సంవత్సరమున మహాభారతయుద్ధ

ముజరిగినట్లులను కనబడదు.

ఇదిగాక, విష్ణుపురాణము 4వ అంశము 24వ అధ్యాయము 23వ శ్లోకమువలన పరీక్షితు మొదలు నంద రాజ్యారంభము వరకు 1050 సంవత్సరములని యు భాగవతము 12వ స్కంధము 2వ అధ్యాయము 26వ శ్లోకమువలన 1115 సంవత్సరములనియు గనబడుచున్నది.

పై శ్లోకములకు "పంచశతోత్తరం" అను పాఠమునుగురించి పైనివివరించియుంటిని. ఆపాఠమువలన 1500సంవత్సరములనియు గనబడుచున్నది. నందులు 100సంవత్సరములు పృథ్వీపాలనము జేసినట్లు లనుచాణక్యుడు నందవంశోన్మూలనము జేసి చంద్రగుప్తునికి రాజ్యమిచ్చెననియు చంద్రగుప్తుని మనుమడగు అశోకుడు బి. సి. 270 సంవత్సరముల క్రిందట రాజ్యము చేసినటులను పైనిగనబరచితిని.

ఇందువలన యుధిష్ఠిరుడు బి సి 1900 సంవత్సరములకు పూర్వముగాని 1400 సంవత్సరములకు పూర్వముగాని రాజ్యము జేసినటుల గనబడుచున్నది.

ఇంతియగాక పాణిని వ్యాకరణము సూ॥ద్రో

॥ఉపర్యుత జీవంతాదన్యతరస్యాం॥ అను 4. 1. 103సూత్రమువలనను సూ॥ వాసుదేవార్జునాభ్యాంవున్॥ అను 4 3.98 సూత్రమువలనను సూ॥ గవియుధిభ్యాంస్థిరః,, అను8 3.95 సూత్రమువలనను పాణిని కిపూర్వము మహాభారతయుద్ధము జరిగినటుల వ్యక్తమగుచున్నది.

పాణిని కాలమునకు శ్రీకృష్ణులు పూజార్హులుగనుండి వారిచరిత్రము మిక్కిలివ్యాపించి యున్నటుల దోచుచున్నది. పాణిని క్రీస్తుశకమునకు పూర్వము 12, 13శతాబ్దముల క్రిందటనున్నటుల గోల్డుస్మిత్తు (Gold smith) అనునాంగ్లేయపండితునిచే రుజువుచేయబడినటుల ధీరేంద్రనాథుగారువ్రాసిరి..

కాబట్టి మహాభారతయుద్ధము బి సి 13, 14వ శతాబ్దములకు పూర్వము జరిగియుండవలెనుగాని దరిమిలానుజరిగినదనుట కవకాశమియ్యదు.

కాన నెన్నివిధముల యోచించినను బి సి. 1194వ సంవత్సరమున మహాభారతయుద్ధము జరిగినటుల గనబడకపోవుటయేగాక 12, 13వ శతాబ్దములలోనుజరిగినటుల గనబడదు.

ఇకకల్హణపండితునిచే వ్రాయబడిన యంశ
మునుగూర్చి యోచించెదము

కల్హణుడు ||శ్లో|| శతేషుషట్సుసార్ధేషు త్ర్యధికేషు
గతేషుచ| సమరంధార్తరాష్ట్రాణాం
పాండవానామభూత్కలౌ||

అనివ్రాసెను ఇందునుబట్టి కలియుగమున 653సం వత్సరములు గతించినపైని 654వ సంవత్సరమునన మహాభారతయుద్ధము జరిగినదను నభిప్రాయము వ్యక్తమగుచున్నది.

ఇందునుగురించి విచారింతము.

శ్రీకృష్ణావతార కాలమునందలి భీష్మనిర్యాణకాలమున మహాభారతయుద్ధము జరిగినదనుట సుప్రసిద్ధము.

శ్రీకృష్ణావతారము విష్ణుపురాణము 5వ అంశము 23వ అధ్యాయమునందలి.

శ్లో|| ద్వాపరాంతేషు కేర్జన్మ యదువంశేభవిష్యతి||

అను 27వ శ్లోకమువలన ద్వాపరాంతమునను 4వఅంశము 24వ అధ్యాయమునందలి

శ్లో॥ యస్మిన్‌కృష్ణోదివంయాత స్తస్మిన్నేవతదాహని
ప్రతిపన్నం కలియుగంతస్య సంఖ్యాంనిబోధమే॥

అను 31వ శ్లోకమువలన కలియుగప్రవేశదివ
మున నిర్యాణమును జరిగినటుల గనబడుచున్నది.

కలియుగారంభము ఇప్పటిక్రీస్తుశకము1908వ సం
వత్సరమునకు 5008 సంవత్సరముల క్రిందట ప్రమా
ధిసంవత్సర చైత్రశుక్ల ప్రతిపతు నందైనటుల జ్యోతి
స్సిద్ధాంత గ్రంథములయందు జెప్పబడి యున్నది.
మహాయుగాదిప్ర మాణములుసౌరాదిసిద్ధాంతములం
దును మన్వాది గ్రంథములందును శ్రీమద్భాగవత
విష్ణుపురాణాది గ్రంథములయందును నేకరీతి నేచెప్ప
బడియున్నవి.

శ్రీమద్భాగవతము11వస్కంధము 4వ అధ్యాయ
ములోని శ్లో॥ యమేవం శేవతీర్ణస్యభవతః పురుషో
త్తమ।శరచ్ఛతం వ్యతీతాయాం పంచవిం
శాధికంవిభో॥

అను25వ శ్లోకమువలనను విష్ణుపురాణము5వ
అంశము37వ అధ్యాయములోని20వశ్లోకమువలనను
శ్రీకృష్ణావతారాద్యంత కాలము125 సంవత్సరముల

చిల్లర అయినటులగనబడెను.

ఇందునుబట్టి యిప్పటి 1918వ సంవత్సరము నకు పూర్వము 5088 సంవత్సరములు మొదలు 5133 సంవత్సరముల మధ్యకాలమున మహాభారత యుద్ధము జరిగియుండవలెనని కనబడుచున్నది.

మహాభారతములోని భీష్మపర్వము 121వఅ ధ్యాయమునందలి

శ్లో॥ ధారయిష్యామ్యహంప్రాణా నుత్తరా యణకాంక్షయా॥

అనుశ్లోకమువలన కురుపాండవ యుద్ధములో పదియవదినమున బడిన భీష్ములవారుత్తరాయణము వచ్చువరకు ప్రాణములనుధరించి యుండినటుల గన బడుచున్నది.

ఇవిగాక నాగ్రంధమునందనేక స్థలములలో నంపశయ్యయందుండి భీష్ములవారు నిర్యాణమునకై యుత్తరాయణమును నిరీక్షించుచున్నటుల జెప్పబడి యున్నది.

అనుశాసనిక పర్వము 167వఅధ్యాయములోని 28వ శ్లోకమువలన మాఘశుకేకాదశినాడు భీష్ముల

వారు నిర్యాణమును పొందినటుల గనబడుచున్నది. శాంతిపర్వము 47వ అధ్యాయములో నిరివశ్లోకమువలన భీష్మనిర్యాణ దినమునసే యుత్తరాయణ మగునటుల గనబడెను. కావుననాకాలమున మాఘశుక్లైకాదశి నాడుత్తరాణమైనటుల గనబడుచున్నది.

పైనిగనబడిచిన కలియుగారంభమునకు(5008సంవత్సరములకు' పూర్వముభీష్మ నిర్యాణమగు నెడల మాఘశుక్లైకాదశినాడుత్తరాయణముప్రవేశించదు ఏలనన.

కాంతిపాత పరిభ్రమణముగ తిరుగునెడల నాకాలమున మేషాది బిందువునకు పశ్చిమమునగను వక్రముగ భగణపూర్తి revolution జేయునెడల తూర్పుగ 48భాగల దూరమునను నుంచను.

కాంతిపాత మేషాదిబిందువునకు తూర్పుగ11భాగలు మొదలు41భాగల దూరమున నుండు కాలముననేగాని తద్వ్యతిరిక్తముగ నుండుకాలమున మాఘశుక్లైకాదశి యందుత్తరాయణము ప్రవేశించుట యసంభవము.

కాబట్టి పైనిగినబరచిన ద్వాపరాంత కాల మునకును భీష్మనిర్యాణ కాలమునకును నః రోఘమగు పరస్పరసంభంధము కలిగియుండుట యసంభవమగు టవలనను మహాభారతయుద్ధ కాలమును నిర్ణయించుట కు మహాభారతము ముఖ్యమైనదగుటవలనను కల్హాణ పండితుడు కురుపాండవ యుద్ధము ద్వాపరాంతము న జరిగియుండుట యసంభవముగ దోచించి కలి యుగముననే జరిగినదని నిర్ణయించినటుల గానబడు చున్నది.

శ్లో॥ అత్రిః కృతయుగేచైవ ద్వాపరె
శుశ్రుతోమతః। కలౌ వాగ్భటనామాచ॥

అని ఆత్రేయసంహితయందు చెప్పబడి యున్నది. అందువలన వాగ్భటుడు కలియుగమునందున్నటుల గనబడెను.

వాగ్భటుడు అష్టాంగ హృదయమునువ్రా సెను ఆయుర్వేద విజ్ఞానమును వ్రాసిన వినోదలా లాసేనుగారు అంమదిరొూదాసుని శిష్యుడు శుశ్రుతు డు. ఈతనితరువాత వాగ్భటుడు ఈతని పుత్రుడు సింహగుప్తుదు వీరిపుత్రుడు వాగ్భటుడనియు వాగ్భ

టుమ యుధిష్ఠిరుని సభలోని వైద్యుడనియువాసిరి.

ధర్మరాజుగారిసభలోని వైద్యుడగు వాగ్భటుడు కలియుగములోనున్నపుడు యుధిష్ఠిరుడు కలియుగములో నున్నటుల జెప్పకతీరదు

కానదికల్హణపండితునియభిప్రాయమునకుసహకారిగనున్నది.

పైనుదహరించిన ''ఆసన్మఘాసుమునయః అనుశ్లోకము నకువృద్ధగర్గుని యభిప్రాయముపైని వివరించియుంటిని. అందలి.

॥షడ్ద్వికపంచద్వి మితశ్శకకాలస్తస్యరాజ్ఞశ్చ॥ అను పాఠమునుబట్టికల్హణపండితుడు కలియుగము 654వసంవత్సరమున మహాభారతయుద్ధము జరిగినటుల యభిప్రాయమునొందెను.

భీష్ములు ధర్మరాజునుగూర్చి పలికిన అనుశాసనికపర్వము। 66వఅధ్యాయములోని

శ్లో॥ అగంతవ్యంచభవతాసమయేమమపార్థివ
వినివృత్తే దినకరేప్రవృత్తే చోత్తరాయణే।

అను 134వశ్లోకమువలనసూర్యుడు దక్షిణాయనమును విడిచియుత్తరాయణము ప్రవేశించుదినమున నిర్యా

ణము నొందుదును గావున నాసన్నయమనగా నుత్త
రాయణము ప్రవేశించినకాలమున తన సన్నిధికి రా
వలెనని చెప్పినటుల గనబడుచున్నది —
అనుశాసనిక పర్వము 167వ అధ్యాయములోని
శ్లో॥ సనిర్యయౌ గజపురాద్యాజకైః పరివారితః। దృ
ష్ట్వా నివృత్తమాదిత్యం ప్రవృత్తం చోత్తరాయణం॥
అను 4వ శ్లోకమువలన యుధిష్ఠిరుడు దక్షిణాయనము
ను విడిచి యుత్తరాయణగతుడైన సూర్యునిజూచి భీ
ష్ములసన్నిధికి వెళ్ళినటులగన బడుచున్నది —
భీష్ముడు తమనిర్యాణసమయమునకు వచ్చిన ధర్మరాజు
నుగూర్చి పలికిన పై అధ్యాయములోని
శ్లో॥ దిష్ట్యా ప్రాప్తోసి కౌంతేయ సహామాత్యో యు
ధిష్ఠిర। పరివృత్తో హి భగవాన్ సహస్రాంశుర్దివాకరః॥
అను 26వ శ్లోకమువలనధర్మ రాజునుగూర్చి భీష్ములు ప
లుకుచున్న సమయమునకు సూర్యుడుత్తరాయణ గ
తుడైనటుల కనబడుచున్నది.
పై అధ్యాయము 27వ శ్లోకమువలనమాఘ శుక్లైకాదశి
యందు భీష్మనిర్యాణ మనియు శాంతిపర్వము 47వ అ
ధ్యాయములోనితవశ్లోకము వలన సోమమునను త్తరా

యణ ప్రవేశమనియు గనబడుచున్నటుల పైనివివ రించితిని.

ఏని సంఘటనబట్టి మాఘశుక్లైకాదశి యందు భీష్మనిర్యాణ మనియు నాదిన ముదయకాలము న నుత్తరాయణము ప్రవేశించు నటులను నాదినము నుత్తరాయణ గతుడగు సూర్యుని జూచి నాటిప్రాతఃకాలమున యుధిష్ఠిరుడు భీష్ములసన్నిధికి వెళ్లినటులను నాసమయమున భీష్ములు ధర్మరాజునుగూర్చి అనుశాసనికపర్వము167వ అధ్యాయములోని25,26,27 శ్లోకములలోని వాక్యములను బలికినటులను నాయధ్యాయములోని 29మొదలు తుదవరకుగల శ్లోకములనుబట్టి 29వ శ్లోకము మొదలగు శ్లోకములలోనివాక్యములను శ్రీకృష్ణులవారినిగూర్చి పలికి పిమ్మటభగవద్ధ్యాన పరాయణులై యోగమార్గాను సరణముగ నా దినమున నేనిర్యాణ మొందినటులనుగనబడుచున్నది.

కలియుగము 654సౌరాబ్దమగు అంగీరస సంవత్సరమున కురుక్షేత్రమునందలి మాఘశు11 బుధవారంరోజు అర్ధరాత కాలమునకు మేషాదిబిందువునుం

డి303 $\frac{3}{65}$ భాగల దూరమున సూర్యుడును $79\frac{11}{15}$ భాగం దూరమున చంద్రుడును కృత్తికా చతుర్థ చరణమున క్రాంతిపాతయునుండెను.

కానన్నీరోజు వృదయకాలమున నుత్తరాయణ ప్రవేశమును సూర్యోదయాది 45½ ఘుటికల వరకు నేకాదశియు 44-౦ వరకు ఆర్ద్రానక్షత్రమునుగలవు.

(క్రాంతిపాత మేషాదిబింబమునకు తూర్పుగ 11 భాగలుమొదలు 41భాగవరకునుండు మధ్యకాలమున మాఘశుక్లైకాదశి నాడప్పుడప్పు డుత్తరాయణము ప్రవేశించుచుండును. గానియీవిధముగ సంభవించుట యరుదుగనుండును

ఈదినము పైనిగనబడిచిన లక్షణములకనుకూలపడి యుండుటవలన నీదినమున భీష్మనిర్యాణముగుటకును నీసంవత్సరమున మహాభారతయుద్ధము జరుగుటకును తగియున్నటుల గనబడుచున్నది.

కల్యాణపండితుని యభిప్రాయమునకిది సహకారిగనున్నది.

ఈపైయంశములనుబట్టి విచారింపగ మహాభా

రత యుద్ధకాలమును గూర్చి కల్హణ పండితునిచే విశేషపరిశీలన జేయబడినట్లు గనబడుచున్నది గాని అపార్థకల్పన జేసి వ్రాసినట్లు గనబడదని విశదీకరించుచున్నాడను.

కావునిందలి గుణాగుణములను నిపుణత బరిశీలించి తెలియజేయుండ వేడెదను.

కొటికలపూడి యజ్ఞేశ్వరగారి నరసింహశర్మ

7-11-08 బొబ్బిలి.



సమాప్తి

BOBBILI. Samsthanam Sri Rangaraya Vilas Press, Printed by K. Padmanabha Patnaik. 1909